కోని లాగుతూంది]

మ: లాభంలేదు కల్యాణి. ఇక నామాట విను.

క: ఒక్కమారు వెళ్ళండి. మీరు చెప్తే వింటారు. మా నాన్న భయపడ్తున్నారు. వారు చెప్పి లాభంలేదు. ఈ పాడు పెండ్లితో మన సంసారంలోని శాంతంతా కూలిపోయింది. ఒక్క మారు వెళ్ళండి.

మ: ఎంతో చెప్పాను. నామాట వినలేదు. వినరుకూడా. ఏం చేసేది?

క: రైలు వచ్చే వేళయింది. పొండి. నన్ని ఆపత్తునుండి నుండి తప్పించండి. ఒక్కమారు పెళ్ళి చేసుకుంటానని చెప్పండి. తిరిగి వస్తారు. చెప్పండి.

మ: ఎలా చెప్పను?

క: ఏం?

మ: సాధ్యంకాదు.

క: సాధ్యంకాదూ! అవును. నాకు తెలుసు. నన్ను మీరు ప్రేమించడంలేదు.

మ: అదికాదు కల్యాణి!

క: ఇంకొకర్ని ప్రేమిస్తున్నారు.

మ: వెళ్ళాడాను.

క: అబద్ధం.

మ: కాదు - దాని మానప్రాణాలు నా చేతుల్లో పెట్టింది. ప్రమాణంగా చెప్తున్నాను. మాట ఇచ్చాను. దానికి ద్రోహం చేయలేను.

క: నన్ను నట్టేట ముంచేస్తున్నారు. చూస్తూ చూస్తూ నా జీవితాన్ని నాశనం చేయడానికి ఒప్పుతున్నారు. చిన్ననాట్నుంచి మీరే నా బ్రతుకంతా అని అనుకొన్న నాకే శిక్ష విధిస్తున్నారు.

మ: నిస్సహాయుణ్ణి. ఇంక నన్ను నమ్మకోని లాభం లేదు.

క: పోనీండి. ఈ చిన్న సహాయం చేయండి. మాటవరసకు చేసుకొంటాననండి- ఈ గండం తప్పించుకోవచ్చు. ఈ మాత్రం చేయండి. వెళ్ళండి ...... ఈ సహాయం కూడా చేయలేరూ!

మ: ప్రయోజనము లేదు కల్యాణి-

[ గంట మ్రోగింది. రైలుకూత ]

అదో రైలుకూత- ఆయన వెళ్తారు. కాళ్ళట్టుకొంటాను. ఒకమారు వెళ్ళండి. మధూ... మధూ

మ: పరిస్థితులు ఇలా విషమిస్తాయనుకోలేదు. ఏంచేసేది. నీ పవిత్ర హృదయంలో ఇంత గాఢప్రేమ వుందనుకోలేదు. కళ్యాణి క్షమించు- నాచేయి మించింది. నిస్సహాయుణ్ణి

[రైలు వెళ్ళుతున్న వైపు నిశ్చలంగా చూస్తున్నారు.]

క: వెళ్ళింది రైలు.

మ: వెళ్ళింది. [రెండడుగులు పెట్టాడు]

క: అయితే ఈనరకం నాకు తప్పదా?

మ: నేనీ నరకం చూస్తూ ఉండలేను.

క: పోనీ ఒక్క సహాయం చేస్తారా.

మ: ... ... ...

క: ఎంత రాతిగుండె మధూ

మ: ఏవిటి ?

క: పెళ్ళి కాదులెండి. నన్ను మీతో తీసికెళ్ళండి.

మ: ఎక్కడికి?

క: మద్రాసుకు

మ: ఎందుకూ?

క: ఈ నరకం తప్పించుకోడానికి

మ: సరే- వెళ్దాం.

క: [సంతోషం] మధూ...-[చరచర లోని కెళ్తూంది]

మ: [ఏమో స్ఫురణకు వచ్చింది] కల్యాణి-

క: ఏం?

మ: వద్దు. మానేయి- లాభంలేదు.

క: ఆ! ఏ వన్నారు

మ: దూరాలోచన చేశావా?

క: బాగా ఆలోచించాను.

మ; తండ్రి చాటున వుండాల్సిన నిన్ను ఏలా తీసికెళ్ళడం!

క: ఏం?

మ: లోకం కదూ !

క: ఈ సహాయం చేద్దురూ- మిమ్మల్ని కలకాలం తల్చు కుంటాను. మీ పాదాలంటుతాను- [కాళ్ళమీద వాలింది.]

మ: సాహసించలేను.

క: మరి మీ చేతుల్తోనే సాళీలాన్ని యింకోరి కప్పగిస్తారా.

మ: యిప్పుడే నేను మద్రాసుకు వెళ్ళిపోతున్నాను.

[ మధు వెళ్ళాడు ]

జ: [కన్నీళ్ళతో వచ్చాడు.]

క: నాన్నా ఇదిగో- మావను పిలిచి ఎవరిచేత ఈ కంఠానికి ఉరిత్రాడు బిగించాలనుకున్నాడో బిగించమను.

జ: అమ్మా! అమంగళం మాట్లాడొచ్చా?

క: ఎంత వెర్రివాడివి నాన్నా! నా జీవితమే అమంగళం అయింది. ఇంక ఈ గొంతు వేరే ఏం పలుకుతుంది!

[ కల్యాణి వెక్కి-వెక్కి- ఏడుస్తూ లోనికెళ్ళింది. ]

*[కొన్ని క్షణాలపాటు రంగమంతా చీకటి]*

జా: [దూరంలో వింటున్న మేళం దగ్గరి కొచ్చింది. మేళం వింటూ నిశ్చేష్టుడై ఆ వంకే చూచాడు. ఆపుకున్న దుఃఖం పొంగివచ్చింది. అణచుకొని కన్నీళ్ళు తుడుచు కొన్నాడు]

అ: [కోపంతో మండిపడుతూవచ్చాడు] ఏమయ్యా జాలయ్యా! కన్యాదానం చేయాల్సిన సమయం. ఇంకా ఈ కన్నీళ్ళు, ఈ కొరతలు నీకు నీకూతురికి తరిగేటట్టులేదు. ఏదో నాకెక్కిన ప్రీత్యర్థంగా ఏడుస్తున్నారేగాని, ఇది పెళ్ళి శుభసమయమనే మాట మీా వొంటపట్టనేలేదే [మేళం వినబడ్తుంది.]

క: [ఏదో నాన్నతో చెప్పాలని కన్నీళ్ళతో తటాలున వచ్చింది. అప్పయ్యను చూచి జంకి లోనికెళ్ళింది.]

అ. ఏదో వియ్యాల వారు బ్రతకలేక మీాకాళ్ళు చుట్టుకొన్నట్లు ఏడుస్తారేమయ్యా! రావయ్యా! పెళ్ళివారు స్నాతకాలయి ముహూర్తానికి వస్తున్నారు.

జా: వస్తున్నాను పదండి. తల్లిలేని బిడ్డని మనసుకొచ్చి సంకట మయింది.

[సుడిగాలి దుమారం లేచింది]

అ: ఇదేంది- ముహూర్త సమయానికీ సుడిగాలి దుమారం. పందిలి ఆకులు ఎగిరిపోతున్నాయి. 'ఒరేయ్ సుబ్బా

వెంకడూ- సేద్యగాళ్లను పిలిచి సరిచేయండిరా! రావయ్యా జాలయ్యా రా! [హడావిడిగా లోనికెళ్ళాడు].

క: [వచ్చింది] నాన్నా!

జా: అమ్మా!

క: అలా చూడు నాన్న- ఈపాడు పెళ్ళి చేస్తారా? ఎన్ని అపశకునాలు. ఇదీ మీమనసుకు రాలేదే. అదో అమ్మ అలాచూడు- ఎలా ఏడుస్తుందో- ఈపెళ్ళివద్దు నాన్నా! [ఏడుస్తూ లోనికెళ్తుంది.]

జా: [లోని కెళ్ళాడు]

[మేళం వినబడింది- ఆగింది].

[అప్పయ్య, జాలయ్య మరికొందరు పెళ్లివాళ్ళు అటు ఇటు వెళ్ళారు]

క: (తలంతా రేగివుంది. డస్సిపోయిన ముఖం- తెగిపోయిన పూలమాల- భాషికంతో తూలిపోతూవచ్చింది).

అ. (కోపంతో వచ్చాడు) ఏమే! అమ్మాయ్! ఇంత భయం భక్తి లేని పాటు ఎవరన్నా పడ్తారమ్మా! పెళ్లీపీటల మీద పెళ్లికొడుకును వాళ్ళను అక్కడ కూర్చోపెట్టి జరగాల్సిన పన్లను దొంగలకుతోలి ఈప్రకారం సమయం సందర్భంలేకుండా ఏడ్పులు- అగాయిత్యాలు- ఎవరు చెప్పారే దుర్బుద్ధులు మీకు? నాగవల్లి అయిన తర్వాత

కౌరవ ఏడ్పులు ఏడవొచ్చు, రావమ్మా కదిలి- నలుగురి ఎదుట నాపరువు తీసిందాక వదలుకోవటమ్మా!

క: ఇంకా ఈ శవానికి అలంకారం పూర్తి కాలేదా!

అ: ఆ! జరిగే కార్యం ఏందీ! నీనోటవచ్చే మాటలేంది? ఇంత చిన్న పెద్ద లేకుండా ఎవర్ని చూచుకొని ఈ విరగబాటు నీకు? ఎంత సాహసానికి ఒడిగట్టావు. నన్నే ధిక్కరిస్తు న్నావే? ఆ- కళ్ళు తెరవని కూనను నిన్ను పెంచి పెద్ద జేసిన నేరానికి ఒకరి చేతుల్లో పెట్టకపోతే దేశమ్మ కాకులైపోతారని కనికరించి నెత్తివవేసుకొన్న మేలంతా క్షణంలో కాలతన్నావే? ఇదా నీవునాకిచ్చిన విలు వంతాను? కవళానికి కరువైన మీకు కోటీశ్వరులు భర్తలౌతారనుకొన్నావా? రావమ్మా మర్యాదగా కదిలి?

క: ఎంత కనికరం తేనివాడివి మామా! నాకష్టాన్ని తలచు కొని కంటినిండావ్వ ఏడవనివ్వవా? నీవనుకొన్నట్లే జరుపుకొన్నావే? ఇంకా నీకసిదీరలా- నిన్ను నీకొడుకును నమ్ముకొన్నందుకు ఇద్దరు నాకు తగిన శాంతి చేశారు— ఎవరెట్లా అనుకుంటేఅట్లా జరిగిపోతుంటే అంతా గౌర వమే, ప్రతిష్టే. మీగౌరవ ప్రతిష్టలకోసం ఎవరుబలైనా చింతలేదు. మీ కొడుకు నిన్ను దుఃఖరించిపోయి

ఎవరో్ని పెళ్ళాడ్తే మీరేంచేశారు? సాగితే ఇట్ల సాగక పోతే అట్లానా! చాలు-అనుకున్న పనయిపోయింది. ఇంక మీ వేషం మార్చుకోండి- నేనూ నా వేషం మారుస్తాను.

అ: నీలో యింత వెక్కసం సాహసం దాగుడుమూతలాడే ది నేను గుర్తించుకోలేకపోయాను. నీ నిజరూపం చూప టానికి సమయంకోసం కాచుకొని ఉన్నానా?

క: ఎదుటివాళ్ల కష్టసుఖాల్ను యింత దూది పింజల్లా ఊది పారేసే మీమనస్తత్వాన్ని మార్చుకోండి. మా బ్రతుకు గాలికి ఎగిరిన పేలపిండికాదు. ఎందుకు యింకా పాపాలు చేస్తారు! నా బ్రతుకు అడివిన కాచిన వెన్నెల అయిుండనే కనికరం ఇంకా మీకు కలుగలేదే. నాజీవిత ప్రతిబింబం పెంత వికారంగా భయంకరంగా నృత్యం చేస్తుందో చూడండి (పెద్దపెట్టుగా ఏడ్చింది) నామంగళ సూత్రం చీకినతాడని మీకళ్ళకు కనుపట్టంలేదా! ఇదో ఒక్కమారు కళ్లు తెరచిచూడండి (ఏడ్పు) ఇంక మీ ఐశ్వర్యానికి ఆశయాలకు దిష్టిబొమ్మనయినాను. ఇప్పటికి ఈ అలంకారం సార్థకమయింది.

అ: [దిగ్భ్రమ చెందినవాడిలా - కల్యాణివంక చూచాడు- తనకు తెలియకనే] కల్యాణీ!

క: కల్యాణి చచ్చింది!

అః జాలయ్యా!

క: పిచ్చివాడైనాడు.

అః కల్యాణీ! క్షమించమ్మా! నిన్ను అన్యాయం చేశాను. జాలయ్య పాపం- ఎంతమంచివాడు. జాలయ్యా! జాలయ్యా!

జాః (వచ్చాడు) ఏమయిందమ్మా!

అః జాలయ్యా! ఎంతమంచివాడివి! మిమ్మల్ని నమ్మించి ఈ దుఃఖవాహినిలో ముంచేశాను. కల్యాణీ! జ్ఞానోపదేశం చేశావమ్మా! జాలయ్యా! జాలయ్యా! కల్యాణీ [వెర్రిగా పిలిచాడు.]

జాః బావా! బావా!

అః ఈ సంసారం నాకొద్దు. ఇవిగో తాళాలు. మీ బ్రతుకు తెరువు మీరు మీకిష్టం వచ్చినట్లు చూచుకోండి. ఈ ఆస్తంతా మీకిచ్చేశాను.

[యజ్ఞోపవీతం తెంచాడు]

క: మామా! మామా!

అః క్షణంలో నా యావజ్జీవితంలో కలిగిన అనుభవమే జ్ఞానానికి దారితీసింది. కల్యాణీ! అమ్మా! నాకెంత మేలు చేశావమ్మా! మీ అమ్మ పార్వతమ్మ నన్నెంతగా దూషిస్తుందో- నేను నిన్ను ఇలా చేస్తాననే ముందుగా కాల

ధర్మమయిపోయింది. పుణ్యాత్ములాలు ఇంకైనా సుఖంగా ఉండండి. (రెండడుగులు నడిచి నిలిచాడు) జాలయ్యా! కల్యాణీ! కన్నులు పచ్చనై కానరాలేదు. కాస్త లోనికి తీసికెళ్ళండి.

[జాలయ్య కల్యాణి యిద్దరూ లోనికి తీసికెళ్ళారు]



# ~ 4వ తరంగం ~

[అప్పయ్యపంతుల యింటి వాకిలి వరండా. సన్యసించిన అప్పయ్య కూర్చొని ఉన్నాడు. భగవద్గీత చదువుతున్నాడు].

అప్పయ్య- [ముఖంలో దైన్యం]

ధ్యాయతే విషయాన్ పుంసః సఙ్గస్తేషూ పజాయతే
సంజ్గత్సంజాయతే కామః కామాత్ క్రోధోభిజాయతే॥
క్రోధాద్భవ సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుధినాశో బుద్ధి నాశాత్ప్రణస్యతి॥

కామంవల్ల కోపం, కోపంవల్ల సమ్మోహం, అంటే యుక్తాయుక్త విచక్షణజ్ఞానం- నశించటం కలుగుతుంది. పాపాలు చేయడం కర్మచేతనే. అంటే సత్కర్మచేతనే జ్ఞానం, జ్ఞానం చేత మోక్షసాధన,- ఈసత్యమనే పరమాత్మను, స్వార్థాన్ని పరిత్యజించి పరహితార్థం కర్మనాచరిస్తూ జన్మ కడతేర్చుకోవాలి. అహంకారానికి ఆస్పదమిచ్చే ప్రతి విషయాన్ని పరిత్యజించాలి. మంచి ఘట్టమే... బాగా అన్నాడు కృష్ణపరమాత్మ.

రా: [వచ్చాడు. అప్పయ్యను గుర్తించలేదు] సామి! దండం పెడతా!

అ: రా- కూర్సోవయ్యా!

రా: అప్పయ్యగారు యీయింటి కామందుండాడా?

అ: ఆ రావయ్యా! గుర్తుపట్టలేక పోయావు. నేనే.

రా: నీ పేరూ అప్పయ్య సావులోరా... మిమ్మల్ని కాదు ఈ యింటి కామందుండాడే ఆయన్ను నేనడిగేది.

అ: ఆ అవున్లే... నేనే... రాండి... కూర్చోండి.

రా: [గుర్తుపట్టాడు] ఆ అవునే... ఇదేంది అప్పయ్యగారూ! సన్నాసోడివైనావే... అన్నంతపని జేసినావే-

అ: ఏదో జన్మకడ తేర్చుకొందామని రెడ్డిగారూ—

రా: సన్నాసం తీసుకొన్నపాట జన్మ కడతేరి పోద్దంటయ్యా! నీమాటలుగాకుంటేను. నీవు ఎన్నైనాజెప్పు నాకేం సమాధానంలా- ఎంత ఆస్తి- ఎంత కమామీసు- దరిమాల్న ఆస్తే! ఇదంతా ఎవరునిగ్గిస్తారు. సింహాంవాల నువ్వుంటే యిదంతా నిగ్గతుణ్ణిందే— అబ్బా! బలే తెంపు జేసినావే. అన్ని వదిలేసినావే— నేను పదిరోజులు శవణాశ్రవంకాడ వుందావనుకంటే— వీలుకాకుండా ఉండదే- పోతే గొడ్డేవో గొదేవో సేద్దం- నాద్దెం ఎట్టుంటదో అని పాణం కటకటలాడిపోద్దే- ఇవన్నీ ఎట్టొదిలేశావు. ఏం కథ— నీకోపం- నీకసి యాడదాచిబెట్టినావయ్యా.

అ: నాకోపతాపాలునన్నెంతగ ఇంతవరకు ఎక్కిరిస్తున్నా యో-

కనుక్కోలేకపోయాను. జాలయ్యకు కల్యాణికి ఎంతో ద్రోహంచేశాను. ఈ పాపానికి పరిహారమే లేదు.

క: నాన్నా! నాన్నా! [ పిలుస్తూవచ్చింది]

అ: పక్కింటికి పోయినాడమ్మా!

క: [ఎంతో నమ్రతగా యివతలనుంచి అవతలికి వెళ్ళింది]

[క్షణం నిశ్శబ్దం]

రా: ఈబిడ్డ గదో జాలయ్య కూతురు.

అ: [కన్నీళ్లు కారుస్తున్నాడు] ఈ అమ్మాయే జాలయ్య కుమార్తె రెడ్డిగారూ! నాచేతులార వితంతువును చేశాను.

రా: బంగారంవంటిబిడ్డ- అన్యాయమైపోయిందే- అంతా యిన్నాలే.

అ: అందుకే- ఏడుస్తున్నాను- నామూలాన దానికా దురవస్థ సంభవించింది.

రా: ఎర్రికోపం- నీకు వళ్లుదెలవదు- అబ్బయ్య తొందరపడి పెళ్ళిచెయ్యొద్దన్నే- యినకూడదో? మాసికి పట్టుయిడు పులుండొద్దా. కొంతసేపటికైన కలదెలుసుకోవద్దో!

అ: [భగవద్గీత ముడిచి లోనికివెళ్ళడానికి ప్రయత్నంచేస్తున్నాడు]

జా [చేతిలో పాలలోటాతో వచ్చాడు] ఎప్పుడు రెడ్డిగారు రావడం.

రా: ఇందాకొచ్చాన్లే. బలే పనిజేశినావే! అప్పయ్యను సన్నా శోణ్ణిజేసినావే!

జా: వారి అదృష్టం- అందరికి లభ్యపడుతుందా యోగం?

రా: ఉండవయ్యా ఏంయోగం బలేయోగం? పాలు యింకొంచం తేవయ్యా ఏవో పాలకు కరువయినోళ్ళు తెచ్చినట్టు తెస్తుండావే. తేవయ్యా చెంబుతోను. ఆయన ఎట్ట అనుభవించినోడు ఏంకత సన్నాసంతీసుకొన్న పాట కూటికిమాడ స్తుండారే—అయ్యా అప్పయ్యగోరూ!—ఇప్పుడు సన్నాసం ఒదులుకోడానికి వీలుంటదా- వీలుంటే ఒదిలైపోద్ది పీడ. నాకు బలే పీకతుండది ప్రాణం! మన అబ్బయ్యా వస్తుండాడే. ఎప్పుడొచ్చారు పట్నంనుంచి.

అ: [లోనికి వెళ్లాడు]

మ: [వచ్చాడు]

రా: అయ్యా! దండంబెడతా! ఎప్పుడు రావడం? చిన్న పంతులుగోరు.

మ. ఈ రోజే వచ్చానండి.

రా: అంతా బాగుండారయ్యా.

మ: ఆ! మీరంతా కులాసాయేనా?

రా: ఇట్టుండాం- యాడబట్టినా కరువులు కాటకాలు- పంటలు తేలిరావడం లా! కాదుపోదు. సంసారాల్లో ఖర్చులు పెరిగి పోయినాయి— అయివోజులు చాలక మునకరాములుగ వుండది మాపని. చిన్నరైతుకు పెద్దరైతుకకూడా రైతాంగం నాణ్ణెం చెడిపోయింది. యాడబట్టినా నశింపు గావుండది. రేడియోలుమాత్రం కదిలిస్తే సందడి- ఊపిరి సలుపుకోకుండా మనకంతా మేలుకలగద్దని చెప్తుంటే చెవులు ధ్వనించిపోతుండాయి. కొంపలు గోడెలు లేకుండ మానాలమీన గుడ్డలులేకుండ యాదుల్లో కనిపెంచతా కుక్కలు నక్కలాల బతకతా, పురుగులోలె ఆడనే పుట్టడం ఆడనే పెరగడం చూస్తుంటే అవమానంగా వుండది. కనికరంగల మనసుండేవోడివి గనక నీతో చెప్పాకున్నా! మీరు మీ భార్యగోరు కూడుగుడ్డ యిచ్చి వెయ్యిమంది బీదోళ్లు బిడ్డల్ని చదివిస్తుండారని యిన్నా!

మ: ఏదో బ్రతికినందుకు గుర్తు.

రా: గొప్పోళ్ళకు గొప్పబుద్ధి గొప్పాలోచన. కనకనే యింత మేలు చేయగలగతుండావు. దేవళానికిపోతే దేముడి గుణాలు మనకెట్లు జ్ఞాపకంవస్తాయో సిన్నుచూచినపాట ఈ పదేలు మీ సంస్థకీయ్యాలని మనస్సుకొచ్చింది. [పైకం కట్ట మధూకు యిచ్చాడు] తీసుకో అయ్యా! దిక్కులేనోళ్ళకు దోవకల్పించినోడే దేవుడు!

మ: సహృదయులు- మీ ఆశీస్సులు మాకు గలగటం మా పుణ్యం— రెడ్డిగారూ! [కళ్ళు చెమ్మగిల్లాయి. గద్గదంగా] మీకు నా నమస్కారాలు.

[రెడ్డి చేతులు పట్టుకొన్నాడు]

రా: అయ్యా! ఎంతమాట! జాలయ్యా! మీకియ్యాల్సిన పైకం ఒక్లు అమ్మిస్తా.

జా: చిత్తం.

అ: [వచ్చాడు]

రా: అయ్యా మీకు మంచి పేరొచ్చింది. అన్ని బాగనేవుండా యిగాని! అప్పయ్యగోరు చేసినపని నా కేంసమాధానంలా. నీమనసు కెట్టుండదో!

మ: తెలిసిందేగ! కల్యాణి పెళ్ళి విషయంలో దాన్ని—

అ: నాయనా! కల్యాణి వైధవ్యానికి నేనాకర్తను? ద్రోహం చేయాలనే చేశానా! అవును- నేనే కర్తను. రత్నంలాంటి బిడ్డ. దాన్ని చూచినపుడల్లా గర్భం ఛేదించుకొని పోతుంది. ఏంచేయను- తల్లీ! దైవప్రతికూలం మానవ బలానికతీతం. రెడ్డిగారూ యిట్లారండి.

[కన్నీళ్ళు తుడుచుకొంటూ లోపలికెళ్ళాడు]

రా: [నిశ్శబ్దంగా లోని కెళ్లాడు]

జా: [కన్నీళ్ళు తుడుచుకొంటూ మనోవేదనతో అటూఇటూ తిరుగుతున్నాడు]

మ: [లోనికెళ్ళాడు]

సు: [వచ్చింది] చిన్నాయనగారూ! మీరే ఇలాచేస్తే కల్యాణి స్థితి యింకేంకావాలి!

జా: దాని స్థితి యింకేమవుతుందమ్మా! ఏంకావాలో అదే అయిందమ్మా! దాని జీవితాన్నే కొరకాకుండా చేశాం. తెలిసి తెలిసి దాన్ని, దాని సుఖాన్ని ధ్వంసం చేశాం. లేకుంటే...

సు: లేకుంటే - కల్యాణి మధూను పెళ్ళిచేసుకొని హాయిగా ఉండేదిగదా చిన్నాయన! నాయీస్థితి ఆమెకుండవలసిందే గదా! నిజం!—

క: [ఇంతలోనే కల్యాణి వచ్చింది.]

సు: అమ్మా! కల్యాణి!

క: నాన్నా! ఇంకా వాళ్ళ యింట్లో అవలక్షణంగా మన ఏడ్పులు- గొడవలు ఎందుకు వెళ్లిపోదాంరా నాన్నా. మనకున్న చనువు అనువు ఏనాడోపోయింది. ఇంక మన గతి దుర్గతయింది [ఏడుస్తూంది]

సు: [సమీపించి కల్యాణ్ణి దగ్గరకు తీసుకొని] నన్నెవరో పరాయిదాన్నిగా భావిస్తున్నావా అమ్మా! ఈయింట్లో

పుట్టిపెరిగిన నీకు లేని హక్కు నాకెక్కడుందమ్మా!
కల్యాణీ— క్షమించు- నిజంగా. . . . నేనే నీ యీస్థితి
కంతా కారణం. కన్నుపొడిచి కన్నీటికి కారణం
అడిగితే ఏంచెప్తావు? చిన్నాయనా- కల్యాణీ! నన్ను
మన్నించండి [వేదనతో లోనికెళ్తుంది.]

జా: అమ్మా! సుశీలా— ఇదేమిటి—— నేను నీమనసు నొప్పిం
చాను—— క్షమించమ్మా——

*[ఒక్క క్షణం నిశ్శబ్దం]*

ఈ నిశ్శబ్దం అనే ప్రతిచోట ప్రేక్షకులు
సన్నివేశాల్లోని సన్నితాలన్నూ భావాలను
నటనల ప్రవేశ నిష్క్రమణాలలోని అర్థాన్ని
సరిగా అర్థంచేసుకొంటున్నారో లేదో తెలు
సుకొని సన్నివేశాన్ని రసవంతంగా నటించ
టానికి యీ విరామం.

మ: [ప్రవేశించాడు]

జా: మధూ! యీగతి యేంచేశావు? మమ్మల్ని యింతకు
ముందులాగే భావించుకో! నాయనా!

మ: మామా! ఆపదలందు ధైర్యం తెచ్చుకోవాలిగాని
యిలా క్రుంగిపోతే యేంచేయగలం?

జా: [కల్యాణివంక దీనంగాచూస్తూ] దౌర్భాగ్యుడి కడుపున పుట్టినందుకు నాజీవానికి యింకా యేడు.- వంచేస్తాం తల్లీ! అనాధలం! మన కష్టాలను ఎవరితో చెప్పుకోవడం. ఎవరు మనకు అండ అనుకొన్నామో వాళ్లు పరాయి వాళ్ళయినప్పుడు మనం చేసేదేముందీ! కాలం యింత వ్యతిరేకమౌతుందనుకోలేదు. [జాలయ్య లోనికెళ్ళాడు]

*[క్షణం నిశ్శబ్దం]*

మ: కల్యాణీ!

క: ... .... ...

మ: ఇలాచూడు

క: ..., ... ...

మ: ఏడవకు

క: నాబ్రతుకు.. యేడుపుగాక యింకేముంది !

మ: మనసు కుదుటబరచుకో కల్యాణీ!

క: [దుఃఖం పొంగివస్తుంది]

మ: కల్యాణీ!

క: కల్యాణి! [దుఃఖం పొంగివస్తుంది]

మ: ఊరుకోవు.

క నన్నలా పిలువకండి [ఏడుస్తుంది]

మ: నీకాపేరు సార్థకమే.

క: నాకా?

మ: నాన్న మొండిపట్టు నిన్నీస్థితికి తెచ్చింది.

క: వారేం జేశారు?

మ: మరింకెవరు?

క: మరింకెవరు! మీహృదయాన్నే అడగండి.

మ: ఏమిటో మాట్లాడుతున్నావ్.

క: నామాట లెలా బాగుంటాయి? బాగుంటే నాకీస్థితి ఎందుకుబడ్తుంది. నామాటలే మీకర్థమైవుంటే నేనెందుకు యిలా ఔతాను.

మ: విచారించకు- గడిచింది.

క: లేదులెండి. విచారానికింకేముంది! ఊరట చెప్పటానికే వచ్చారా?

మ: అంతేకాదు-

క: మరి?

మ: నీ జీవితాన్ని నువ్వు యిష్టపడితే...

క: ఇష్టపడితే!

మ: బాగుచ్చేద్దామని!

క: నాజీవితాన్నా? ఎంతదయండి మీకు!

మ: నిష్ఠూరం!

క: కాకుంటే- నాజీవితాన్ని బాగుచేయటం...

మ: ఎందుక్కా-కూడదూ?

క: ఎలాగవుతుంది?

మ: చెప్తాను. నామాట వింటావా?

క: ఏం మాటా!

మ: ఆ—

క: ఎందుకు ఇంకా ఏంచేయదల్చుకొన్నారు?

మ: [క్షణం నిశ్శబ్దం] నీవిష్టపడితే...

క: నాయిష్టమేముంది.

మ: మరి ...

క: మీయిష్టాయిష్టాలేగా నన్ను—

మ: ఇంతకూ నేను కర్తనంటున్నావా?

క: మీకు తెలీదూ? నమ్ముకొన్నదాన్ని నట్టేటముంచేశారే— తుదకు నన్ను మద్రాసుకు తీసికెళ్ళమని ఎంత బ్రతిమాలాను. తీసుకెళ్ళుంటే నాకీస్థితి పట్టివుండేదికాదేమో! నన్నెంత గతి పట్టించారు. [ఏడ్పు] ఇంతక్కు మిమ్మల్ని అని ఏం లాభం? నాపూజాఫలం యిలాగుంది.

మ: [ఏమీ తోచక మనోవేదనతో రెండడుగులు నడిచాడు] నా స్థితి నీకు చెప్పలేదు కల్యాణి.

క: నాస్థితి మీకు చెప్పలేదూ? మీరే కండ్లారా చూడ లేదూ?

మ: గతాన్ని మరచిపోవాలి- ధైర్యం తెచ్చుకోవాలి.

క: మిమ్మల్ని ఎలా మరవటం—?

మ: అంత ద్రోహం చేశానా!

క: ఇంకేంకావాలి. నేపడేకడగండ్లు తెలిసి తెలిసి... మీ ఆనందానికి... మీసౌఖ్యాలకు... మీ... ఎందుకు లేండి!

మ: అది కాదు కల్యాణి.

క: మరి యింకేమిటి?

మ: మళ్ళీ పెళ్ళి...

క: ఎవరికి-

మ: నీకే?

క: నాకా? ఎంతమంచివారండిమీరు- మీసహాయమే మరచి పోలేను. [కన్నీళ్లు] నన్ను హేళనచేస్తావా మధూ? అవును— నాకేం రూపమా- చదువా— ధనమా— నా బ్రతుక్కు- హేళనకాక ఇంకేముంది?

మ: కల్యాణి! నిన్ను హేళనచేస్తానా?

క: కాకుంటే పెళ్ళట! పెళ్ళి! నాపిడికెడు మెతుకులే అంత బరువైతే... ఎక్కడో నీళ్ళబిందలో, వంటచేసికొన్నో

బ్రతుకుతాను. మానాన్నకూ బరువైతే ఏమూరో గోయో చూచుకొంటాలెండి- నాపెళ్ళి యమధర్మరాజు దగ్గరే. మీరన్నట్లు మళ్ళీపెళ్ళి జరుగుతుంది- మీరు మీభార్యగారు చుట్టాల్ను మర్యాద చేస్తుర్లెండి:

మ: గడచినదాన్ని గూర్చి వెక్కసపడితే ఏంలాభం? కల్యాణి- నీవు మాతో మద్రాసుకువస్తే- బాగా చదువుకొని హాయిగా వుండువు. ఇంకా నువ్వు...

క: ఎందుకూ అక్కర్లేదులేండి- ఇక్కడ ఒక పెళ్ళయింది మద్రాసులోయింకోటా? మీనాన్న మీమీదకోపంతో ఒక పెళ్ళి చేశారు. మీ నాన్నగారి మీద కోపంతో మీరు యింకో పెళ్ళి చేయాలా? చాలు.... యింకేం అక్కర్లేదు_ ఇంతేనా? చాలు- ఇంక వెళ్లండి- వెళ్లండి.

మ: [తలవంచుకొని రెండడుగులు నడిచాడు]

క: వెళ్తున్నారా?

మ: నీకు కోపం వస్తూంది... నేను కసపడకుంటేనే నీవు శాంతంగా వుంటావు.

క: [ముఖాన చేతులు అడ్డంపెట్టుకొని ఏడుస్తూ మంచం మీద వాలింది]

*[కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దం]*

మ: [లోసికెళ్ళిపో ...]

సు: [వచ్చింది] కల్యాణీ! అమ్మా!...

క: అక్కయ్యా!

సు: చెప్తే వినవ్వుకదూ!

క: ... ... ...

సు: ఏవిటిదంత! ఇలా చూడమ్మా!

క. ఏంలేదులే అక్కయ్యా-

సు: నీవిలా కృశించడం నేను చూడలేకున్నాను. కల్యాణీ నీ యీ స్థితి ఎరిగి నాట్నుంచి నాహృదయం పడే ఆవేదన నీకు మాటల్తో చెప్పలేను. నీ భావి జీవితాన్ని ఆనందాన్ని అధ్వాన్నం చేసిందాన్నని- నన్ను భావిస్తున్నావా అమ్మా!...... నీ పెళ్ళికి ముందు మధుగారితోటి నీసంబంధ బాంధవ్యాలు నాకు తెలిసుంటే, యిది యిలా జరిగేవుండదమ్మా! నన్ను క్షమించమ్మా... కల్యాణి....

క: అలా అనకు అక్కయ్యా- ఎంతమాట నేనా నిన్ను క్షమించడం- నన్ను క్షమించమ్మా- [కాళ్ళమీద వాలబోయింది- సుశీల వారించింది.]

సు: నువ్వెందుకో నాహృదయానికి అంత దగ్గరకొచ్చేశావు నాహృదయంలోని ప్రేమంతా నీకిచ్చేశాను. నీకోసం ఏమైనాచేస్తాను.. నాతో వస్తావా?

క: ఎక్కడికి?

సు: మద్రాసుకు!

క: ఎందుకు!

సు: నీకీ వాతావరణం మార్చి కొంత హాయి కల్పించాలని.

క: నామీద నీకెందుకు యింత దయ-

సు: దయేకాదు. ప్రేమ.

క: ప్రేమ....!

సు: ఆ- అవును... నమ్మవూ? వస్తావా?

క: వద్దక్కయ్యా, నామాట వినవూ? నీ ప్రేమను కాదంటు న్నాననుకోకు... నేను యింకెక్కడ ఉండటానికి అర్హత లేనిదాన్ని- లేకుంటే-

సు: వెఱ్ఱి ఊహలు- కల్యాణీ! ఆయిల్లు మాత్రం నీదికాదూ!

క: నాదా!

సు: అవును-

క: నిజంగా?

సు: తప్పక.

క: అలాగైతే నీ తోటి...... నేను..... మధూ...

[తట్టాలున ఆపివేస్తుంది. నిట్టూర్పు]

సు: ఏం? నాదగ్గరనా దాపరికం...

క: ఏమీ లేదు- నిజంగా ఏమీ లేదంటున్నా-

సు: ఎంత నిర్మల హృదయంతో అడుగుతున్నానో గుర్తించ లేవూ! అవును — చీకట్లో తాడు కాలికి తగిలినా పామే నని భయపడ్డాం. బ్రతుకు లక్షణమే అంత— ఇలా చూడు కల్యాణీ! మన జీవిత నాటకాలకు విలక్షణ మైన పేర్లను పెట్టుకొని ఎంతో అందంగా అలంకరించు కొని, ఆనామాలను సంకీర్తనం చేసుకొంటూ మురుసు కొంటున్నా-మనకు వికారంగానే తయారవుతున్నాయి- [నిట్టూర్పుతో] దీనికి తోడు మన ప్రారబ్ధంకొద్దీ మన మెడకు మంత్రించి కట్టిన యీ మంగళసూత్రంలోని రక్షరేకులు రెండు మనం అనుభవించాల్సిన సుఖదుఃఖా లకు నమూనాలుగా శాసనాలుగా తయారైనాయి— కల్యాణీ! ఈ అవస్థలు దేముళ్ళకే తప్పలేదని మనం సంతోషించాలమ్మా! ఊరట పొందంది మనస్సుకు హాయి రాదు... ఇక మద్రాసుకు రావడం నీచేతుల్లో లేదు- నేనే తీసికెళ్తాను.

క: అలాగే అక్కయ్యా!

[మధు వచ్చాడు- కల్యాణి వెళ్లింది.]

మ: కల్యాణి యేమనింది?

సు: నేనడిగితే యేమంటుంది!

మ: రానంటుంది-

సు: మనతో మద్రాసు వస్తుంది.

మ: ముందే కల్యాణిని మద్రాసుకు తీసికెళ్ళివుంటే యిలా జరిగివుండేది కాదేమో!

సు: ఇంతకూ ఏంలాభం? కల్యాణికీ మీకుగల సంబంధ బాంధవ్యాలు దాచారు.

మ: [పరధ్యానంగా అటుయిటు తిరుగుతున్నాడు]

సు: ఈ పాపంలో నాకు భాగం పంచిపెట్టారు.

మ: ఏమో అన్నావ్!

సు: కల్యాణ్ణి చూచినప్పట్నుంచి దాని జీవితాన్ని ఏలా బాగుచేయటమా అని బాధ పడ్తున్నాను.

మ: [నిట్టూర్పు విడిచాడు]

సు: కల్యాణికి నేను ఋణపడ్డాను.

మ: [ఆలోచనతో లోనికెళ్లాడు.]

సు: [ఏదో ఆలోచిస్తూ మధు వెళ్ళిన వంకే చూస్తూ సోఫాలో కూర్చొనింది.]



# 5వ తరంగం

[సుశీల యింట్లో ఓ పడక గది. ఒక ప్రక్క సోఫా సెట్టు. టేబిల్ పైన మధు ఫోటో- టేబిల్ సెటు.]

[కల్యాణి గుట్టుగ ప్రవేశించింది. చేతిలో పూలదండ వుంది. తలలో పెట్టుకోవాలనుకొని మధు ఫోటోను చూచి పూలు పెట్టుకోటంమాని ఫోటోవంక నడుస్తూ ఓ మారు వెనక్కు తిరిగి చూచింది. ఎవరూ లేరనుకొని సమీపించి, మధు ఫోటోను పూలదండతో అలంకరించి, కొద్ది క్షణాల పాటు అలాగే చూచి నిస్పృహతో బరువుగా టేబిల్ కు ఆనుకొని కన్నీళ్లు పెట్టుకొనింది.]

క: [పెద్ద నిట్టూర్పుతో] విధి చేతలకు ఎంత బలముంది—

ఓ! హతవిధీ
మారు వేష ధారీ ||హ||
గతిలేని మా బ్రతుకుల
నడివీధి పాలుజేసి
మా పడు బాధల
కొక్కొక వేషము దాల్చేవా? ||హ||
మా కన్నీరుల, మున్నీరుల
నిట్టూర్పుల తెరచాపల
సుఖయానము జేసెదవా
హతవిధీ మారువేష ధారీ.

ఎన్నాళ్ళు యీ దేవుడులేని గుడికి అర్చకత్వం- ఎన్నాళ్ళు యీ మూగనోము. ఎవరు నా సొత్తనుకొన్నానో వాళ్ళే పరాయివాళ్ళకు సొంతమైపోయి నా యెదుటే అనుభ విస్తుంటే చూస్తూ చావలేక యీ బ్రతుకు యిలా ఎన్నాళ్లు సాగాలి? ఈ దంపతుల మధ్య నా జీవితమేమిటి?...

[ధీమాగా] పరాయివాళ్ళుకట్టిన త్రాటి ప్రతిబంధకం ఎన్నడో తెగిపోయింది. నా ప్రేమ బంధం తెగుతుందో, వూడుతుందో తేల్చుకోవాలి. [మధు ఫోటో చేతికి తీసు కొంటుంది]. మధూ!... [కన్నీళ్ళు]

సు: [వచ్చింది] మధూ ఏరీ?

క: [ధీమాగా తనలో] నాలో దాచుకొన్నాను.

సు: అప్పుడే వచ్చేశారా—

క: [దీనంగా] ఇంకా రాలేదమ్మా!

సు: [తన చేతిలోని పూలదండను మధు ఫోటోకు వేయాలని ఆవంక నడుస్తూ- ఫోటోకు పూలదండ వుండడం గమ నించింది].

క: [భయంతో] అక్కయ్యా!

సు: ఇంకా నీవూ తయారుకాలేదే- ఆలస్యం కాలా?

క: [గుండె ఆగినట్టయింది] ఆ...

సు: ఇలాగే వెళ్తావా?

క: బ్రతుకులో లేని సొగసు బాహ్యానికి వుంటే మాత్రం...

సు: నామాట నేను దక్కించుకోలేక పోయాననుకొంటు న్నావా?

క: ఏ మాట?

సు: నీ జీవితాన్ని విలక్షణంగా నడిపిస్తానని నీకు ప్రమాణం చేశాను-

క: పోనీ అక్కయ్యా! ఆమాట లెందుకులేమ్మా!

సు: నేనే నీకు అలంకారం చేస్తాను. [తలలో పూలు పెట్టి కుంకుమబొట్టు పెట్టబోయింది.]

క: వద్దమ్మా వద్దు.

సు: మధూ వచ్చేస్తారు. ఆలస్యమయితే బాగుండదమ్మా- కోప్పడు తారు.

క: ఆ-

సు: మధుపట్ల నాకన్న నీకే యెక్కువ స్వాతంత్రముంది.

క: నేనే పాపం ఎరుగనమ్మా! [ముఖాన చేతులడ్డంపెట్టు కొని యేడుస్తుంది.] నా ప్రారబ్ధం. నాతోటి విమోచన గాక మిమ్ములనందరినీ బాధపెడ్తున్నాను.

సు: నన్ను బాధ పెట్టున్నట్టు నీవు వూహించుకొంటూ నీవే బాధపడుతున్నావు.

క: నేనే నిన్ను బాధపెడుతున్నాను. నాపాపం నిన్ను వెంటాడుతుంది.

సు: పాపం! ప్రారబ్ధం! ఏ ఆశయాన్నైనా అందుకోలేని స్థితిలోనే, పాపమనో, ప్రారబ్ధమనో, మనల్ని మనం నిందించుకొంటాం— బాధపడుతుంటాము. పాపపుణ్యాలు కష్టసుఖాలు, జీవితాశయ స్వరూపాలకు యిచ్చే రంగులు, ఛాయలు మాత్రమే!

క: భగవాన్! ఎంత స్థిమితంలేని బ్రతుకైపోయింది.

సు: నీ మనస్సు నింకా నొప్పిస్తున్నానా! [కల్యాణిని దగ్గరకు తీసుకొని బొట్టు పెట్టింది.] ఇప్పుడు నిజంగా కల్యాణివే! ఎంత జీవకళ. ఇన్నాళ్ళకు నా కోరిక నెరవేర్చుకొన్నాను. కల్యాణీ- మనలో అంతర్గతంగా వుండే ఆశలకు, ఆశయాలకు సుఖసంపత్తి నిచ్చే రూపకల్పన ఏర్పడినప్పుడే జీవితం ధన్యమౌతుంది. ఆశయాలన్నీ ఆభరణాలౌతాయి. ఏడవకు కల్యాణీ, ఏడుపు ఖిలత్వానికి వికారమైన ప్రతిబింబం. జీవితంలోని-ష్టాంశాలనే మనం ధైర్యంగా ధ్యానించుకోవాలి.

క: అక్కయ్యా!

సు: ఏం?

క: నామీద నీకెందుకు యింత ప్రేమ?

సు: సావిత్రాద నీకెందుకు యింత ప్రేమ!

క: ఏమో!

సు: ప్రేమకు కారణం కావాలా! మనమిరువురం స్త్రీలం కనుక-

[మధు వస్తాడు. మధు రాకను గమనించి కల్యాణి లోనికి వెళ్ళింది.]

మ: సుశీ! విద్యామందిరానికి ఎప్పుడో వెళ్ళాల్సింది. ఇంకా యిక్కడే వున్నావు... కల్యాణేది?

సు. లోపలుంది.

మ: మరి పిలు వెళ్దాం.

సు: [పిలవదల్చుకోలేదు కాని మళ్ళీ వద్దనుకొంది]. కల్యాణి తర్వాత వస్తుందిలెండి.

మ: సరే మీ యిష్టం- నిన్ను విద్యామందిరంలో వదిలేసి మళ్ళీ నేను రావాలి.

[ఇద్దరు ఒకే వైపు వెళ్ళారు. కారు బయలుదేరిన శబ్దం వినవచ్చింది. కల్యాణి వచ్చింది- సుశీల పెట్టిన కుంకుమ అలాగేవుంది. నిలువుటద్దం దగ్గరకి నడుస్తూంది. నడకలో నిస్సత్తువ- కళ్ళల్లో నీరు- ముఖంలో దైన్యం - అద్దంలో ముఖం చూచుకొనింది.]

క: [మధును చూచింది] ఆ— మధు—

మ: అలంకరణ ఆకర్షణకోసం కాదుగా— ఆత్మ సంతృప్తి కోసమేగా! భయమెందుకు.

క: తప్పే- హక్కులేని దాన్ని ఆశించాను.

మ: కాదు- నీవు కళ్యాణివే- మనం పెట్టుకొన్న పేర్లు భగవంతుని కల్యాణ గుణాలకు రూపాంతరాలు. మనమే సార్థకం చేసుకోవాలి. స్త్రీకి దురవస్థ పెద్దల మౌఢ్యం చేత కలిగింది. తొలగించొచ్చు.

క: ఎవరు తొలగిస్తారు?

మ: నేను—

క: మీరు! ఎలా?

మ: నీకు అపనమ్మకమా!

క: కాదు- సాధ్యమా అని!

మ: సాధ్యంకాకేమి?

క: సాధ్యమే అయితే నాకీ గతి ఎందుకు పట్టించారు.

మ: రమణరావుతో మాట్లాడాను-

క: ఆయన ఎవరు?

మ: నీకు తెలుసుగా విద్యామందిరములో అధ్యాపకులు—

క: అయితే!

మ: నిన్ను పెళ్ళి చేసుకొంటాను.

క: నన్నా!

మ: ఆ— అవును—

క: నేనెవర్ని చేసుకోదల్చుకోలేదు... ముందే చెప్పాను.

మ: మొండిపట్టేనా? ఎన్నాళ్ళిలా కృశిస్తావు?

క: పూర్తిగా నశించేంతవరకు—

మ: నా మాట వినవూ!

క: ఏవిటి?

మ: పెళ్ళి!

క: మధూ [కోపం]

మ: ఏమన్నానని?

క: ఏమనాలి? నా హృదయాన్ని నా ప్రేమను కేవలం మీరు చెప్పేవారికి మాటమాటికి మార్చే వస్తువులుగా చేశారు. మీ హృదయం మీ ప్రేమ మీ మాట మీద ఒకే దారిలో నడిచేదాన్నిగా నిర్ణయించుకొన్నారు. అంతకన్న యింకేంకావాలి?

మ: నిష్ఠూరమా?

క: నిజమాడితే నిష్ఠూరమే? ఎందుకు— నేవూరికెళ్తాను?

మ: మరి నీ చదువు?

క: వచ్చిన చదువు చాల్లెండి-

మ: మొండి పట్టేనా- మార్పులేదా?

క: అవును- [కన్నీరు] నా హృదయం నీకర్పించాను. ఇంకోరికి లేను— క్షమించు మధూ!

మ: కల్యాణి!

క: ... ....

మ: అయితే -సుశీల స్థానాన్ని-ఆమె సౌఖ్యంలో భాగాన్ని కోరుతున్నావా?

క: లేదు— నాకు వేరే పెండ్లి అక్కర్లేదన్నాను- బల వంతంగా నన్ను యింకోసారి చంపొద్దన్నాను.

మ: సుశీలకు ద్రోహం చేయటవా? . . . కాదు.

క: మధూ! ద్రోహం? నీ పంచ నాశ్రయించానని నన్ను యిలా అనటం? ప్రాణప్రదంగా ప్రేమించిన సుశీలకు ద్రోహంచేయాలనా నా ఆశ- నానిశ్చయాన్ని చెప్పాను. ఎంత చులకనగా అన్నారు. నే వెళ్తాను. నీ యిష్టం. దౌర్బల్యమని అను, ద్రోహి అను నా హృదయం మారటంలేదు.

మ: కల్యాణీ! నువ్వు ద్రోహం చేస్తున్నావన్నానా?

క: ద్రోహానికి నిన్ను దింపుతున్నాను. ఎంత సులభంగా అన్నారండి. యీ ద్రోహి... నీ యింట్లో..

మ: అయితే వేరుమార్గంలేదా? అంతేనా...

క: వేరు మార్గం నాకు వద్దన్నాను... నీయిష్టం.

మ: [దృఢనిశ్చయంతో] అసాధ్యం... కల్యాణి... క్షమించు

క: అసాధ్యమా?

మ: అవును-

క: సుశీల మాత్రం స్త్రీ కాదు— నాప్రేమను గుర్తించ లేదు.

మ: గుర్తిస్తుంది— కానీ-

క: కానీ-

మ: అది కానిపని కల్యాణి— కాదు [వెళ్తున్నాడు]

క: మధూ!

మ: [పోతున్నవాడు తిరిగి చూచాడు]

క: సుశీలతో చెప్పొద్దు-

సు: [వెనకవచ్చి నిలబడి వింటూంది.]

క: [గమనించలేదు.]

మ: [సుశీల వచ్చింది. మధు వెళ్ళాడు.]

సు: కల్యాణి

క: ఆ సుశీ— [ఆ సోఫాలో కూలి ఏడుస్తూంది]

సు: ఏమిటది?

క: [అలాగే ఏడుస్తూంది]

సు: ఏమిటది? చెప్పు? ఎందుకేడుస్తున్నావ్?

క: అక్కయ్యా—

సు: ఏమైంది?

క: నన్ను వెళ్ళనీ అక్కయ్యా— వద్దు—నేను వెళ్తాను.

సు. ఎక్కడికి?

క: వూరికి— క్షమించు అక్కయ్యా పొరపాటు మీ అమ్మ తమయ జీవితంలో విషబిందువయ్యాను. నీ యింట్లో వుండే అర్హత పోగొట్టుకొన్నాను— నేను వెళ్తా [పోబో తూంది]

సు: [ఊరుకొని వుంది]

క: [తటాలున తిరిగి వచ్చి] సుశీ క్షమించవూ? క్షమించా నని ఒక్కమారు అనమ్మా— చాలు సుశీ— సుశీ.

సు: కల్యాణీ— [ప్రేమగా తల నిమురుతూంది]

క: ఇంకా నన్ను ప్రేమిస్తున్నావా?

సు: నా ప్రేమ నీకు ఎల్లప్పుడూ వుంది—

క: సుశీలా?

మ: [వచ్చాడు]

క: [కల్యాణి లోనికి వెళ్లింది]

మ: చూచావా?

సు: చూచాను—

మ: ఎంత విచిత్రమైన సంఘటనో— కల్యాణి-

సు: ఏం?

మ: ఏమిలేదు- అంతా నీకు తెలిసిందేగా-

సు: ఇప్పుడే తెలిసింది—

మ: ఇలా అవుతుందనుకోలేదు—

సు: ఇలా అవుతుందని నాకు ఎప్పుడో తెలుసు- దీనికంతా మీరేగా కారకులు-

మ: నేనా!

సు: ఇంకెవరండీ-

మ: నన్ను నమ్మటంలేదూ?

సు: మంచి ప్రశ్న— ఇంకా మిమ్మల్ని నమ్మమంటారా?

మ: ఏం?

సు: నమ్మి— మిమ్మల్ని నమ్మి పొరబడ్డాను- నాకు ముందు తెలియదు-

మ: అపోహా పడ్తున్నావ్— నీకు ద్రోహం చేస్తానా?

సు: ఇంతకూ తప్పు మీదే- ఒప్పుకోవాలి-

మ: అదేమిటి— నేను తప్పుచేయలేదు. [సోఫాలో కూర్చున్నాడు]

సు: [మధూను సమీపించింది] కల్యాణి మిమ్మల్ని ప్రేమించింది- ప్రేమిస్తూంది— అవునా?

మ: అయితే?

సు: అది దాని తప్పంటారా?

మ: ఏమో?— కాదు.

సు: మీరు కల్యాణి ప్రేమను నిరాకరించారు. పాపం- ఎందు చేతనో —

మ: అంగీకరించే అవకాశంలేక-

సు: ఎప్పుడు?

మ: అప్పుడు- ఇప్పుడు-

సు: బాగా సమర్థించారులెండి- మీకేం? మీ ప్రేమ మీ అనుకూల ప్రతికూలాలను అనుసరించి మారుతుంది గా? మేమే యిటు భర్తలకు అటు సంఘానికి కట్టుబడి కుముల్తూ భస్మమై పోవాలి.

మ: స్వార్థంకోసం నేను ఏనాడు అలా ప్రవర్తించనని నీకు తెలుసు.

క: [సుశీల, మధు వాదప్రతివాదాలు విని సుశీలను సమీపించింది] అక్కయ్యా పొరపాటు బడ్డాను. ఏదో ఉద్రేకంలో అలా తొందరపడ్డాను. మీకెందుకు యీ తగవులు? నేను వెళ్ళిపోతాను. నన్ను వూరికి పంపించేయమ్మా [ఏడుస్తుంది.]

సు: [కల్యాణిని దగ్గరకు తీసికొంటుంది] కల్యాణి నా ప్రేమ

అదుగడుక్కీ మారుతుందనుకొంటున్నావా? మనం ఒక్క కడుపున పుట్టలేదు. నీజీవితాన్ని సలక్షణంగా నడిపించడం నా విధి. ఇది నా ప్రమాణము. నీసుఖ దుఃఖాల్లో నాకూ భాగం వుంది. అది మరచిపోకు. ఏడవవద్దు-

క: [అలాగే ఉంది]

సు: నువ్వు ఏడిస్తే నేనెంత బాధపడ్తానో నీకు తెలియదు.

క. [సుశీల చేతుల్లోనుంచి తిన్నగా తప్పుకొని లోనికెళ్ళింది]

సు: కల్యాణి ప్రేమను అంగీకరించటానికి మీరు ఒప్పుకో వాలి.

మ: సుశీ!

సు: కల్యాణి హృదయాన్ని మీకంటె బాగా అర్థంచేసుకొన్నాను. మా ఆత్మలు ఒకటే. మీరు ఒప్పుకోవాలి.

మ: ఒప్పుకోలేను.

సు: మధూ!

మ: నీ అహింసోపాసన శృతి మించుతూంది.

సు: పవిత్ర ప్రేమోపాసన అహింస, అభేద ప్రతిపత్తే అందలి సూత్రం.

మ: కానీ-

సు: కల్యాణ్ణి సుఖపెట్టడానికి వేరే మార్గంలేదు.

మ: కల్యాణేది?

సు: పిలుస్తాను? సుమిత్రా!

సు: ఆమె ఎవరు?

సు: ధశరథుని రెండవ భార్య- నేను కౌసల్యను- కల్యాణి సుమిత్ర అవుతుంది.

మ: మరి మూడవ భార్య!

సు: కైకేయి. ఆమె మనకొద్దు. మన ప్రేమ సామ్రాజ్యంలో పట్టమహిషి కావాలంటుంది.

మ: నీ స్వార్థ త్యాగానికి పవిత్ర హృదయానికి తల వాలుస్తాను. కాని కల్యాణిని నేను భార్యగా అంగీకరించను—

సు: నిజం?

మ: నిశ్చయం. నా అంతరాత్మ నన్ను అడ్డపెడ్తుంది. [ఇద్దరు క్షణం నిశ్శబ్దం.]

సు: మరి... మీ మతంలో మార్పు రాదా?

మ: అసాధ్యం——

సు: [ఒక మారు మధు వంక చూచి తలవాల్చి ఒక క్షణం అలాగే నిల్చి వంతోచక లోనికి వెళ్తుంది]

మ: [సుశీల వెళ్లిన వంకే చూస్తున్నాడు.

[ఒక్క క్షణం నిశ్శబ్దం]

ఏమో స్ఫురణకు వచ్చి దీపమార్పి లోనికి వెళ్ళాడు. ఇదంతా చీకటిగా ఉంది.]

క: [మధుతో తాను వూరి కెళ్తానని చెప్పటానికొచ్చింది. దీపం చేసింది. ముఖంలో ఓ విపరీతమయిన దృఢ సంకల్పం కనబడ్తూంది. రేగిన జుట్టు చాల డస్సివుంది. మధు సుశీల ఫోటోలను చూచింది. సుశీల స్వార్థ త్యాగం తలచుకొని అవమానం, మధు నిరసన జ్ఞప్తికొచ్చి రోషం...ఆమె హృదయంలో తుపాను రేపాయి. పరచివుంచిన పడకను సమీపించి అట్టే ఒక క్షణం చూసింది. డ్రాయరు తీసింది. లెటర్ ప్యాడ్ తీసి జాబు వ్రాస్తూంది. కన్నీరు తుడ్చుకొంటూంది. అలాగే నిలిపి చదువుకొని వద్దనుకొని చించిపారేసింది. వెళ్ళబోతూ తిరిగివచ్చి ఆముక్కల్ను ఏరుకొని వెళ్ళబోయింది. కాని పరచిన పక్కను చూచి వెళ్ళను కాళ్ళాడక ఓమారు పడకమీద కూర్చునింది. దీపం అలాగే వెలుగుతూంది. పెద్దపెట్టుగా ఏడ్చింది]

మ: [వచ్చాను] ఎవరు?

క: నేనే-

మ: ఏమిటది

క: క్షమించండి. హక్కులేని స్థలానికి తెలిసే వచ్చాను.

మ. అది కాదు. నిద్రపోలా-

క: నిద్రపోతాను— శాశ్వత నిద్రపోతాను.

మ: కల్యాణి ఏమిటీ మూర్ఖం?

క: అవును- మూర్ఖంగా మీరార్పిన దీపాన్ని పదేపదే వెలిగిస్తున్నాను. మీ ప్రశాంతతను భంగపరుస్తున్నాను.

మ: నాహృదయాన్ని యింకా బాధించాలనా నీ ఆశ.

క: లేదు.

మ: నిజం?

క: నిజం... మీకు సంతోషమేగా?

మ: నిశ్చయంగా కల్యాణి!

క: మరి శెలవు.

మ: వెళ్ళి పండుకో

క: పండుకోటానికిగాదు-

మ: మరి?

క: ఊరికి-

మ: నీ ప్రేమను నిరాకరించాననా యింతకు తెగిస్తున్నావు.

క: పదేపదే ఎందుకు బాధిస్తారు?

మ: ఎందుకీ ఆక్రోస్త-

క: మీమీద ఎందుకూ ఆక్రోస్త! నాఆక్రోస్త మిమ్మేల్నేమి చేస్తుంది?

మ: నీ జీవితాన్ని నాశనం జేస్తుంది.

క:. యిప్పుడు బాగున్నట్లా?

మ: బాగుపడగలవు... బాగుపరచాలనే ఈ ప్రయత్న మంతాను.

క: కృతజ్ఞురాల్ని.

మ: కల్యాణీ! విజ్ఞానం కలిగితే నీవిలా అపోహాలకు పాల్పడి ఉద్రేకానికి లొంగిపోయి జీవితాన్ని విషాద విపలిప్తం చేసుకోక సత్యాన్నెరిగి నీకూ భారతనారీ సంఘానికి యుక్తం శ్రేయస్కరం అయిన ధర్మాన్ని నిర్ణయించుకొని నిర్వర్తిస్తావనే చదివిస్తున్నాను. చదువుకోడం ఆయా కాలానికి సరిపడ్డ విజ్ఞానం సంపాదించుకోటానికి-

క: నాకొచ్చిన చదువు విజ్ఞానం చాల్లెండి- నన్ను వెళ్ళనీండి నాకర్మ ఎలా వుంటే అలా జరిగిపోతుంది.

మ: నీప్రేమను నిరాకరించాననా యింతకూ తెగిస్తున్నావు.

క: పదే పదే నన్నెందుకు బాధిస్తారండీ.

మ: కల్యాణీ! నావ్రతం భంగంచేసుకోటానికి యిష్టం లేక యింతగ చెప్తున్నాను.

క: ఏమన్నారు? మీావ్రతం భంగంచేస్తున్నానా? మీారు ఏక పత్నీవ్రతులున్ను, నేనా అంత అవినీతికి పాల్పడింది. చిన్ననాట్నుంచి నిన్ను ప్రేమించి నీతోడిదే లోకమని ఆరాధిస్తున్న నావ్రతమూ పాతివ్రత్యమే- నాపాతివ్రత్యం భంగం కాకూడదనే- ఈ నా వ్రతానికి ఉద్యాసన

మీతోనైనా చేసూాలి లేక నాశరీరంతోకూడ దహన మైనా అయిపోవాలి.

మ: కల్యాణీ! ఆదినుంచి వ్యష్టిగాను- సమిష్టిగాను- మానవ జీవితాన్ని సంఘాన్ని పాలిస్తున్న నీతులు నియమాలు న్నాయి. అవి ఎప్పుడూ ఉండితీరాలి. ఉన్నప్పుడే సంఘం సాఫీగా సాగిపోతుంది. బహుభార్యాత్వంగాని బహు స్త్రీభరత్వంగాని ఏపరిస్థితుల్లో నయినా- స్త్రీ పురుషుల దౌర్భల్యాన్నే చాటుతుంది. నిగ్రహాశక్తి నీరసించిపోయిన నేటి సంఘం ప్రేమయొక్క నిజస్వరూ పం తెలుసుకోలేక బహుభార్యాత్వానికి దిగింది. ఈ బహుభార్యాత్వాన్ని శాసించినా తురలవాళ్లు ద్రోహా నికి లెక్కచేయని మావారు మిమ్మల్ని అవమానంపాలు చేస్తున్నారు.

క: మధు! నేను అవినీతిపరురాల్ని- నీతులు నియమాలు తప్పక సాగిపోయే మీసంసారంలో ఉండటానికి అర్హత లేనిదాన్ని- నన్ను వెళ్ళనివ్వండి— ఇంక క్షణమాగను.

మ: అలాకాదు- సంసారం- సంఘం- దేశం- విశ్వం- అన్యో న్యాధారాలు- నీతి సంసారంలో మొదలుపెట్టి విశ్వా న్నంతా పాలిస్తూ కల్యాణాన్ని చేకూరుస్తుంది. మనలో మొదలు పెట్టిన ఈ దౌర్భల్యం మనతో అంతరించి

పోదు- తరతరాలుగా అది అందివ్వబడుతుంది. మన బిడ్డలకు ఉగ్గుపాలతో ఈ విషాన్ని త్రాగించటం నా మతంకాదు. ఒక్కమాట పెళ్ళిచేసుకోంటానను కో- నీవు పొందగలిగేది ఏంటి?

క: సుఖీ పొందేదేవిటో అదే-

మ: స్త్రీకి భర్త జీవనజ్యోతి- కాదనను- కాని శాంతంగా యోచనచేసిచూడు. స్త్రీ అసహాయ అని- అబలని భరించేవాడొకడుండాలని వాడే భర్తని ఆమె బ్రతుక్కు వాడనసరమని ఆదినుంచీ ఓ అభిప్రాయం మీరా రక్తాణువుల్లో యింకిపోయుంది.

క: కాదంటారా? అనాధలయిన అబలలగతి వారిని సంఘం చూచే విధానం ఎరిగే కాదంటారా?

మ: అవన్నీ ఆర్థిక దుస్థితితో ప్రారంభమైనవే. అంతేగాదు. పితంతువన్నమాట, ఆమాటకింకా ఏదో అర్థాయి పదాలు ఉన్నంతవరకు మీరాకీ భయం తీరదు. మన వారాధించే దేవతలందరు ముత్తైదువులన్నమాట మరచి పోక్కు! ఆర్థికంగా నీకు నేనివ్వగల సహాయం ఎప్పుడూ వుంది. ఇంక మిగిలిందేవిటి? ఒక్క శారీరక సౌఖ్యం... అవునా?

క: [ఎక్కడో దృష్టి. ఒక్కమారు మధూను బాగా చూచింది.] ఆ!... శా... రీ... ర... క... సౌ.. ఖ్యం

మ: ఆ! అవును బాగా ఆలోచించు. ఆశారీరక సౌఖ్యాన్ని నిగ్రహించుకొనే శక్తిలేక స్త్రీపురుషులు తారువారై జీవితాన్ని నాశనం చేసుకొంటున్నారు. అశక్తులు పెళ్ళి చేసుకోటమే మంచిది. కాని మీ సౌశీల్యాన్ని భంగ పరచే ఏభావమయినా అది కేవలం పాపమంటాను.

క: పాపం— మధూ!

మ: అవును- మానవ సామాన్యానికి అశాంతికి కారణమ యిందల్లా పాపమే. ఇప్పటికైనా నేని నియమానికి లోబడి నీలో యీ పరివర్తన అపేక్షిస్తున్నానో అర్థ మయిందా.

క: మధూ [కన్నీళ్లు]

మ: ఇక నీవే నిర్ణయించుకో. నీభావి జీవితాన్ని- శారీరక సౌఖ్యాపేక్షను నిగ్రహించుకొని, నిర్మల ప్రేమను ఆరా ధిస్తూ జీవితాన్ని దేశాభ్యుదయానికి వినియోగించి, సార్థకం చేసుకొంటావో- సతిగా తల్లిగా సంసారాన్ని స్వర్గసీమ జేసుకొంటావో, నీకేవదిలేస్తాను. కల్యాణీ -నిన్ను ప్రేమించి— నిన్ను సుఖపెట్టాలనే యీ ప్రయ త్నమంతా- అది మరచిపోకు.

క: [ఏడుస్తూంది]

మ: [ముఖం పైకెత్తి తల నిమురుతూ] ఏడవకు. నువ్వు ఏడిస్తే నేనెంత బాధపడ్తానో నీకు తెలియదు- చూడు: వెర్రి దానా- ఎందుకు- కఠినంగా మాట్లాడాననా- సత్యసాధన అందుకు మార్గం కఠినమేనమ్మా. [మధు కళ్ళు చెమ్మగిల్లాయి. కాని వెంటనే తట్టుకొన్నాడు.]

క: [ఏమి జవాబు చెప్పకుండా లోనికెళ్తోంది.]

మ: కల్యాణీ-

క: [నిలిచింది]

మ: [సమీపించాడు]

క: ... ...

మ: [ఎంతో కరుణగా] నీవు నీ ఉద్రేకములో నీ విలువైన జీవితాన్ని ఏంచేసుకొంటావో అన్న భయం నన్ను బాధిస్తూంది.

క: చావు తప్పనిదైతే లేదులువార లెందుకండీ-

మ: పొరపాటు-

క: అవును! ఇంక బ్రతకటమే పొరపాటు-

మ: ఎలా బ్రతకాలో నిర్ణయించుకోటంలోనే వుంది విలువంతాను. మన జీవితం మీద మనకంటే సంఘానికి ఎక్కువ హక్కువుంది. తెలుసా?

క: అవును. నిజమండీ. సంపన్నులు- మీరు మిమ్మల్ని

కొలుచుకొనే కొలతబద్దలు వేరు ఆ లెక్కలతో మీరు మా జీవితాలకు ఇచ్చే విలువలు వేరు. మా జీవితాలకు మీరు మతింపులు వేస్తారు. లెక్క చేయరు. మా బోంట్లకు చావుకంటే బతికటమే భయముగా వుంది. [ఏడ్పు] నాకు తోడులేదు నీడలేదు. ఆస్తిపాస్తులులేవు. నన్ను నేనే నమ్మలేనిస్థితిలో వున్నాను. ఎవరిని నమ్మటం. నాజీవిత కాలచక్రానికి ఇంత తలవని తలంపుగా పట్టాలు తొలిగిపోయి కూలిపోతుందనుకోలేదు.

మ: రానికష్టాలకు లేనిబాధలు ఊహించుకొంటూ బాధ పడుతున్నావు- నేను— నా- అనుకోటంలోనే యీ అవస్థ వుంది- కల్యాణీ! లోకం అన్యోన్యాధార భూతం- ప్రతి వ్యక్తి ఈ విశాల ప్రపంచ కృషిఫలితంగా జీవిస్తున్నాడు మనల్ని యిన్నాళ్ళు పెంచి పెద్దజేసింది సంఘం. ఆ సంఘాన్ని మోసగించి, సంఘ హక్కయిన మన జీవితాల్ని స్వార్థానికి బలి యివ్వటం ద్రోహం కాదా అమ్మా...

క: నా జీవితంమీద నాకు హక్కులేదన్నమాట?

మ: ఆ— అవును.

క: [వ్రాన్పడింది. దృష్టి పాతాళైజములోవుంది. మధువంక చూడ్డానికి దృష్టిని ఎంతో కష్టంమీద మరల్చింది.]

కల్యాణి [ఏమిటి అలా చూస్తున్నావన్నట్టు పిలిచాడు.]
నా బ్రతుకుమీద నాకు.. హక్కు లేదు... మరి ఏమిటి జీవితం?

అరిషడ్వర్గాలను సమన్వయం చేసుకోటమే జీవితం... మనం శాంతిపడి ఒకరిని శాంతింపజేయడమే జీవిత ధర్మం. ఈ అంతశ్శత్రువులు అరిషడ్వర్గాలతో ఎంత రాజీపడ్తామో బయట శత్రుజనంతో అంతరాజీతో వాత్సల్యంతో సమీపిస్తాము.
[ఒక్కమారు తనలో తన్ను వెదకిచూచుకొనింది. దృష్టి హృదయాంతరంలో వుంది.]

... ...

నిజం— మధూ— నిజం— నా బ్రతుకుమీద నాకు హక్కు లేదు.

నిజం! వ్యక్తులు సంఘంకోసం తమ మనోవికారాల్ని అరికట్టక తప్పదు- అలా జాగ్రతావస్థలో మెలగటమే అభ్యుదయం- అదే ప్రతి పౌరుడు నేడు మన దేశంలో ఆచరించాల్సింది— ప్రపంచంలో మన దేశం అగ్ర స్థానం వహించాలంటే ప్రతిపౌరుడు నీతిపరుడు కావాలి.
[తన్ను తానే లోలోన విమర్శించుకొన్నట్లు చూపుల్లో వ్యక్తమవుతూంది. స్మృతిపోయిన దానిలా సోఫాలో వాలిపోయింది.]

మ: మన నిత్య నైమిత్తిక జీవితంలోని మంత్రతంత్రాలంతా అలా జాగ్రతావస్థలో మెలగమనే పదేపదే జ్ఞప్తిచేస్తుంటాయి. దేశాభ్యుదయమంతా మీ చేతుల్లో ఉంది. కల్యాణీ! దేశమంటే స్త్రీ. మిమ్మల్ని గౌరవించటం మా విధి.

క: నేను బ్రతకాల- మధూ! [కల్యాణి పరధ్యానంగా చేతులో చేయివేస్తూ పడకమీద వాలింది]

*ఈ క్రింది పాటలుగాని, ఆ పాటలకు సంబంధించిన నటన కల్యాణి హృదయాంతర్గతమయిన భావావేశాలు, ఆమె స్మృతిపథంలో కనపడుతున్న వ్యక్తులు. ఆమె ప్రశ్నలకు జవాబులు నేపథ్యంలో నుంచే వినబడుతాయి.

నేపథ్య గీతిక—

పాట:- లోకమా! ఇది శోకమయము
ఘోరహింసా నిలయము
కడుపుకాలి కూలిపోయే
పేదపాలి నరకము.

[బిచ్చగాడు ప్రవేశిస్తాడు. కొద్ది క్షణాలాగి అప్పయ్య వచ్చి అతన్ని తీసికెళ్తాడు.]

క: మామా! మీతోటి నేను ఈ దీనుల సేవచేస్తాను. నన్ను మీతోటి తీసుకెళ్ళరూ?

అ: [నేపథ్యనుంచి] నీ జీవిత వాహినిని వైరాగ్యంతో వం తెనకట్టు. దారి నిర్భయమవుతుంది. సత్సంకల్పం భగవంతుని సన్నిధానానికి తీసికెళ్తుంది. రామ్మ! రా!

పాట:— మరతువా! ఈ ధారుణీ
మన ఆకలెవరో తీర్చుట
మట్టిలోన పసిడిదీసి
మాడిపోయె కూలిరా! మాడిపోయె పేద రా!

[పేదవాడైన కూలి పార బుజానపెట్టుకొని వచ్చాడు కూలబడ్డాడు]

పాట:— పేదవాడి శ్రమకు కూలి గింజలెచాలు
కాలుచేయాడినన్నాళ్ళు
బలముడిగి మూలబడితే దిక్కెవళ్ళు!
మాలాగు మూలబడితే దిక్కెవళ్ళు?

[ముసలివాడైన కూలివచ్చాడు - రెడ్డితీసికెళ్ళాడు]

పాట:— ఆదరించి సేవజేసి
ఇహము స్వర్గము జేయవా!

క: రెడ్డిగారూ! మీతోటి నన్ను తీసికెళ్ళరూ? పుణ్యాత్ములు మీరు— యీ సహాయంచేయండి? ఇవిగో నానగలన్నీ యిచ్చేస్తున్నాను. [గాజులుతీసింది]

రా: [నేపథ్యంలో] మనసు చెప్పినట్లు చేయబాక, జీవితాన్ని దైవానికి ధర్మంచేయి. మేలుగలగద్ది. రామ్మా! రా!

పాట:— బాపుజీ మన జాతి జనకుడు
గుండెనెత్తురు కుమ్మరించిన
ఈ సమస్యలు తీరవా!
లోకమా యిది శోకమయము
ఘోర హింసా నిలయము

[బిచ్చకత్తెయైన బాలిక వచ్చింది. సుశీల తీసికెళ్ళింది]

పాట:— ఇహము పరములందని
భాగ్యహీనులే పేదవారలా?
దేశమే ఒక దేవళంబు
మనుజుడే మాధవుడురా!

[బిచ్చగాడు వచ్చాడు— మధు తీసికెళ్ళాడు]

పాట:— మాతృదేశ సేవజేయ
సార్థకంబు జన్మరా!!

క: సుశీలా! అక్కయ్యా! మధూ! నాన్నా! మీరెంత ధన్య జీవులు. మీతో నన్ను తీసికెళ్ళండి. ఈ ఒంటరిపాటు భయంగా వుంది.

మ: [నేపథ్యంలో] ఎవరమ్మా? ఒంటరి? స్వార్థపరుడు ఒంటరి. నీలో మేమందరము లేమూ? సర్వేశ్వరుడు నీలోనే ఉన్నాడే— భయమెందుకు? రామ్మా! రా!

క: [అవే భావాలను తలచుకొంటూ వీధిలోనికి వచ్చింది.]

పాట— లేరా నీదేశ దైన్యము బాపుకొరకై పోర రారా
లోకమా! యిది శోకమయము.
లెమ్మ లెమ్మ సోదరీ
లెమ్మ లెమ్మ సోదరా.

[గుడ్డి ముసలి బిచ్చగాడు బాలికతో వచ్చాడు. కల్యాణి బిడ్డను కౌగలించుకొనింది.]

[మధు- సుశీల వచ్చారు]

క: బాబూ నాకళ్ళు తెరిచారు. ఈనాట్నుంచి ఈ జీవితం మానవ సేవకు- దేశాభ్యుదయానికి అంకితం. ఆశీర్వదించండి.

మ: నీవు నీనారీ సంఘానికి కీర్తి గడించుకో!

క: అంతా మీరు కలుగజేసిన విజ్ఞానమే.

సు: మేము కాదు. నాగరికత అంటే అనుభవించి ఆచరించిన మన గోత్రీకులంతా అహింస పరమ ధర్మ మన్నారు. ఆస్మృతి కర్తలే ఈ విజ్ఞానానికి కారకులు.

— సమాప్తి —

